**SRI**

# DEVIGANASUDHA

**VOLUME II**






*Author :*


**OGIRALA VEERARAGHAVA SARMA,**

GOSHPATHI KSHETRAM

**K O V V U R.**

West Godavari District.

శ్రీ

# దేవీగానసుధ

(ద్వితీయ సంపుటి)



గ్రంథకర్త:

ఓగిరాల వీరరాఘవశర్మ

గోష్పదిక్షేత్రము, కొవ్వూరు

పశ్చిమ గోదావరి జిల్లా



# విషయసూచిక



OM

# Sri Kanchi Kamakoti Pithadhipathi,
# HIS HOLINESS JAGADGURU
# SRI CHANDRA SEKHARENDRA SARASWATHI



श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य, श्रीमच्छंकरभगवत्पाद प्रतिष्ठित
श्रीकाञ्ची कामकोटिपीठाधिप जगद्गुरु, श्रीमच्चन्द्रशेखरेन्द्रसरस्वती श्रीपादाः

॥ श्रीः ॥



श्रीमत्परमहंस परिव्राजकाचार्यवर्य
श्रीमच्छंकरभगवत्पाद प्रतिष्ठित
श्रीकाञ्ची कामकोटिपीठाधिप जगद्गुरु
श्रीमच्चन्द्रशेखरेन्द्रसरस्वती श्रीपादैः

क्रियते नारायणस्मृतिः ।

श्रीदेवीगान सुधाख्या षष्ट्यधिकसंख्याककीर्तनघटितेयं रचना श्री ओगिराल वीरराघवशर्मणा विरचिता श्रीपरदेवतास्तुतिपरा अवलोकिता अस्माभिः ।

सुस्पष्टमेतत्, यत् दक्षिणसङ्गीतमार्गाग्रेसराणां श्रीमतां त्यागब्रह्म - दीक्षित-श्यामाशास्त्रि प्रभृतीनां सरणिमनुसरत्ययं कृतिकर्तेति । दृश्यन्ते खल्वासु मुद्रितासु कृतिषु भक्तिरसोद्रेकः, कर्णाटक सङ्गीत शास्त्रसंप्रदायसम्मतानि रागसंचार मूर्च्छनादीनि लक्षणानि, सरलश्च लयप्रस्तारः ।

रचनेयं सङ्गीतरसरसिकानां हृदयंगमा भूयादिति वयमाशास्महे ।

विजययात्रास्थानम्
तण्डयार्पेट्टै - मद्रपुरी
विलम्बिवैशाखशुद्धप्रथमा ।

नारायणस्मृतिः

శ్రీః

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు శ్రీ మచ్ఛంకర భగవత్పాదులచేఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీ కాంచీకామకోటి పీఠమున కధిపతులగు శ్రీ జగద్గురు శ్రీ మచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వాముల వారు నారాయణ స్మరణ పూర్వకముగాఁ బంపిన యభిప్రాయము.



శ్రీ ఓగిరాల వీరరాఘవశర్మగారు, పరదేవతాస్తుతి పరముగా నరువదినాలుగు కీర్తనలతో (కృతులతో) రచించిన దేవీగానసుధయను గ్రంథమును బరిశీలించితిమి.

దక్షిణదేశ సంగీత విద్వదగ్రేసరులగు త్యాగయ్య, దీక్షితులు, శ్యామశాస్త్రి మొదలగువారి సరణి ననుసరించియున్నది వీరి రచన. వీరి కృతులలో భక్తిరసోద్రేకము; కర్ణాటక సంగీతశాస్త్ర సంప్రదాయానుగుణములగు రాగలక్షణములు, చక్కని లయప్రస్తారముఁగాన నగును.

వీరి యీ రచన సంగీత రసాభిలాషులకు హృదయంగమమగుఁ గాక ! యని యాశించుచుంటిమి.

విజయయాత్రాస్థానము
తెండియార్పేట - మద్రాసు.
విలంబి సం॥ వైశాఖ శుద్ధ పాడ్యమి.



నారాయణస్మృతి.

(తెలుఁగున ననువదించినది వా. గంగాధరశాస్త్రి.)

★ कृति भर्ता ★



Dedicated to "Sangeetha Kalanidhi"
Hon'ble Justice T. L. Venkata Rama Iyer,
Judge, Supreme Court of India.

श्री "देवीगान सुधा" नामक गेय ग्रन्थस्य कृतिकर्त्रा श्री ओगिराल वीरराघव शर्मणा कृतिसमर्पणकाले कृतिपतये श्री टि. यल्. वेङ्कट रामय्यर् महोदयेभ्यः समर्पितमभिनन्दनपद्यरत्नपञ्चकम् ॥

---

श्रीचक्रार्चननित्यतोषितमहादेवीकृपावासितः
प्राचीनार्यमते सनातनपथे बद्धादरश्चेतसा
आम्नायोपनिषत्पुराणकवितातत्त्वेषु पारंगतः
टि. यल्. वेङ्कट रामयार्य सुकृती संगीत विद्वन्मणिः ॥

अखण्डनादार्चनया लक्ष्यलक्षणशुद्धया
नादब्रह्मणि निष्णातो धन्यो नादात्मतांगतः ॥

श्रीदीक्षितोपज्ञ सुवर्णगीत
गीर्वाणवाणी रमणीयभूषाः
भवत्प्रदत्ता नितरांविभान्ति
संगीतविद्वद्वर कण्ठदेशे ॥

सुललितसुरभाषाराजभाषाप्रवीणः
परिणतधिषणात्तन्याय शास्त्रार्थवेत्ता
भरतभुवि महोच्च-न्यायमूर्तिप्रतिष्ठः
क इह पुनरहो मे काङ्क्षणीयस्त्वदन्यः ॥

एतादृग्गुणशोभिताय भवते विद्वच्चकोरेन्दवे
देवीगानसुधाख्यगेयरमणीं कन्यां मदीयामिमां
विद्वद्गायकपूर्णसंसदि महादेवस्य तृप्त्यै मुदा
निष्कामेन समर्पयामि मनसा; काङ्क्षन् सदा मङ्गलम् ॥

कृतिकर्ता
ओगिराल वीरराघव शर्मा ।

"वाग्गेयकाररत्न"
ब्रह्मश्री हरिनागभूषणः, बि. ए.
मचिलीपट्टणम् ।

# आशंसा ।

एषोऽयं वीरराघव शर्मा श्री "देवीगान-सुधा" रचयिता एकदा मच्छिष्यः अस्य गेयकविताप्रावीण्यं श्रीमद्गायत्रीभगवतीकटाक्षलब्धमिति, स्वयंच केवलं निष्काम परदेवोभक्त इत्यादि कारणैरनेकैर्बहुधा मत्तो वरीयानिति अस्य गेयकविता पण्डित विमर्शनासहा । साच कविता सज्जनषट्पदैरहरहः पेपीयमाना भुवि वर्धतां वर्धतां वर्धता मित्याशीः कुर्वन्विरमामि । इति सर्वमवदातम् । ओं तत्सत् ।

19—9—57. हरि नागभूषणः ।

# प्रशंसा ।

कर्ता श्रीयुतवीरराघवकविः सङ्गीतविद्यानिधिः
श्रीमद् वेङ्कटरामयार्यसुजनो भर्ता सुधीसंस्तुतः ।
देवीगानसुधाख्यगेयकविता सौगन्ध्यपूर्णा कृतिः
वस्त्वेकैकमपीह पावनमहो दिष्ट्या त्रयः संगताः ॥

कोव्वूर,
7-1-58.

इति बुधविधेयः
के. वें. नृ. अप्पारायः
आन्ध्र-गीर्वाण-विद्यापीठ-संस्कृत-कलाशालाध्यक्षः ।



अवंती प्रेस् - राजमंड्री ।

★ कृति कर्ता ★





Sri Dharwada Hanumantha Rao, B. A.,
Agent, Indian Bank Ltd.
Devotee of Gayatri Devi and a true
disciple of the author.



శ్రీ సద్గురుచరణారవిందాభ్యాం నమః.
శ్రీ సద్గాయత్రీ పరదేవతాయై నమః.

# విజ్ఞప్తి

నా ఇష్టదేవము శ్రీ గాయత్రీదేవి. ఆమె అనుగ్రహాబలమున కర్నాటక సంగీత సాంప్రదాయము ననుసరించి రాగతాళ యుక్తముగా స్వరపరచి శ్రీ దేవీపరమైన గేయములను శ్రీ దేవీగానసుధ యను పేరిట 1947 సంవత్సరములో గ్రంథరూపముగా ముద్రింపించితిని. ఈ గ్రంథమును నాకుసంగీతసద్గురువులైన "వాగ్గేయకారరత్న" బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగారికి, బ్రహ్మశ్రీ టి. యల్. వెంకటరామ అయ్యరుగారి అధ్యక్షతన బందరు పట్టణమున జరిగిన షష్ట్యబ్దమహోత్సవ సందర్భమున విద్వత్సభాముఖమున మదుపాస్యదైవమగు శ్రీ గాయత్రీదేవి ప్రీతిగా నిష్కామభక్తితో కృతిసమర్పణచేయు భాగ్యమబ్బెను. ఈ గ్రంథము కృష్ణాతీరమగు రేపల్లె గ్రామమున నివసింపుచూ వ్రాయగలిగితిని. గ్రంథముద్రణకు అప్పుడు రేపల్లెపురవాసులే ధన సహాయము చేసి నాఆశయమును మిక్కిలి ఆదరించి 1000 ప్రతులను ముద్రింపించిరి. ఆప్రతులను పరదేవీప్రీతిగా గాయకలోకమునకు కొన్ని గ్రంథాలయములకును నిష్కామభక్తితో సమర్పించుకున్నాను. అటు పిమ్మట కొంతకాలమునకు దైవవిధి ననుసరించి పశ్చిమగోదావరి జిల్లాలో గౌతమీతీరమున కొవ్వూరను గ్రామములో నివాసమేర్పడెను. నాజీవయాత్రలో తత్తత్సన్నివేశముల ననుసరించి చరిత్రాత్మకముగా మరికొన్ని గేయములు గౌతమీక్షేత్రములోగూడా వ్రాయుభాగ్యము కలిగినది. నాచేరచింపబడిన శ్రీదేవీగానసుధ రెండవభాగమును పూజ్యు

లును నాదాత్మకులును అయిన బ్రహ్మశ్రీ టి. యల్. వెంకటరామ అయ్యరుగారికి మద్రాసులో వారి స్వగృహమున శుభదినమగు శుక్రవారయుక్తముగా నిష్కామభక్తి ననుసరించి భగవతీ ప్రీతిగా కృతి సమర్పణచేయుట సంభవించినది. కృతినందుకొనవలసినదిగా శ్రీ వెంకటరామయ్యరుగారిని నేను అర్థించగా దయాదరములజూపి వెంటనే వారు అంగీకరించి కృతి నందుకొనినందులకు శ్రీవారికి నా వందనశతము లర్పించుచున్నాను. ఈ సందర్భములో ఆత్మీయులయిన మిత్రులు కొందరు నన్నిట్లు ప్రశ్నింపసాగిరి. మానవులకు కృతిసమర్పణ జేసి ప్రతిఫలము ఏమియు పొందనపుడు సాక్షాత్తు ఆభగవంతునకే ఈకృతి సమర్పణ ఏలచేయరాదు అనిరి. సర్వాత్మలలోనివసించు ఆభగవంతుని సాటిమానవునిలోగూడ చూడగలందులకే అట్టిజ్ఞానమును ప్రసాదించుటకే విగ్రహారాధన లేర్పడ్డవను నిశ్చితాభిప్రాయము ననుసరించి ఉత్తమపురుషులకు నేను కృతిసమర్పణ చేసితిని. ఇట్టి మహనీయుల చేతిలో మా కృతికాంతను ఉంచి పరమేశ్వరార్పణమనుట నాజన్మాంతర పుణ్యమని మిక్కిలి ఆనందింతును.

నాచే రచింపబడిన ఈగేయములను తమిళగాయక విద్వన్మణులు పాఠముచేసి గానసభలలోనూ ఆలిండియా రేడియోలోనూ గానము చేయుచున్నారు. దీనికి కారణము ఆపరదేవీ విలాసము. తమిళగాయకులకు నూతనరచనలయందు సంగీత సాహిత్యములందు వారికిగల పూజ్యభావమే. సహజముగా వారు మృదువైన హృదయముగలవారు. ఒకానొకప్పుడు సుప్రసిద్ధ గాయనీమణి శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్ గారు వారింటికి నేను వెళ్ళినపుడు ఫలములు కొంతధనము తాంబూలములో నుంచి నా కివ్వబోయిరి. నాకీర్తనలు వారు పాడుటేకాక ధనరూపముగాగూడ వారికి నాయందుగల ఆదరణను ప్రకటించియున్నారు. కాని మద్గురువాజ్ఞ ననుసరించి వారిచ్చుధనమును నేను గ్రహింపజాల

నైతిని. అందులకు ఆపుణ్యాదంపతులు మిక్కిలి బాధపడినారు. సవివరముగా నా నియమమును వారికి నచ్చజెప్పి ఒక ఫలముమాత్రము గ్రహించినాను. ఇట్లే మరొకసంఘటన జరిగినది. సుప్రసిద్ధ గాయనీ మణి కీర్తిశేషురాలయిన శ్రీ బెంగుళూరి నాగరత్నమ్మగారు మద్రాసులో వారి స్వగృహమందు నారచనలను గానముచేయవలసినదిగా కోరి వారే స్వయముగా తంబురాశ్రుతివేయుట ఆరంభించినారు. అత్తరి నారచనలను చరిత్రను చెప్పుచూ కొన్నిగేయములను వారి సన్నిధిలో గానముచేసితిని. ఆమెవిని, "ఏపట్టలో ఏపాముున్నదో గదా! త్యాగబ్రహ్మ!" యనుచూ మెల్లగాలేచి లోపలికివెళ్ళి 116 రూపాయలు పళ్లెములోపోసి అందు తాంబూలము పంఛ్లుంచి తెచ్చి, "దీనిని మీరు గ్రహింపవలెను". త్యాగబ్రహ్మముకొరకు నేను నాఆస్తిని నాజీవిత సర్వస్వమును, అంకితముచేసినాను. నేను మీభక్తిభావముతో నిండిన గానమును, సాహిత్యపుష్టిని విన్నాక, సంగీత జగద్గురువైన శ్రీ త్యాగరాజస్వాములవారు మీవంటి ఉత్తమగృహస్థుల హృదయమందే నివసింపుచుందురని నమ్ముచున్నాను. గాన "పత్రం, పుష్పం, ఫలం తోయ"మ్మని నాయథాశక్తిగా మీకీ సత్కారముచేసినచో శ్రీత్యాగరాజస్వాములకు చెందగలదని నాదృఢవిశ్వాసము" గ్రహింపమని అనేకవిధముల నన్ను తొందరచేయ నారంభించెను. ఆతల్లికిగూడా నా గురువాజ్ఞను నా నియమములను విశదపరచి ఒక ఫలముమాత్రము పుచ్చుకొంటిని. ఇట్లనేకములుగా నాజీవితములో దైవపరీక్షలను దాటగలిగితిని. దీనికి కారణము మద్గురువర్యుల అనుగ్రహాబలమేనని మనవి చేయుచున్నాను.

వేదాధ్యయనముచేయు బాల్యదశయందే ఆతల్లి మంత్రానుష్ఠానము జేయుచూ బ్రహ్మచర్యాశ్రమము గడపితిని. ఈ నామానవ జీవితమునకు బాల్యదశయందు అట్టి సదవకాశముగల్గుట ఎంతయో

మహాద్భాగ్యమోయన్నటు యవ్వనదశను పవిత్రముగాగడపి, కౌమార దశలోపడి క్రమముగా భక్తిజ్ఞాన వైరాగ్యముల అలవరచుకొనుటకు ఈనాటికి నాకు గొప్పసహాయకారి అయినది. నాపదిహేనవఏట అపర దేవీకటాక్షమున ఒక దివ్యమూర్తి సద్గురువుగా సంభవించెను. వారు ఘనాంతము, వేదాధ్యయనము చేసినవారు, ఆజన్మ బ్రహ్మచారులు. వారి జీవితమంతయు గాయత్రీ మంత్రానుష్ఠానముచేసి పరతత్త్వోపాస నకే వినియోగించిన సచ్చరితులు. ఇట్టి మహనీయునకు నాయడల అవ్యాజమగు ప్రేమఉదయించి నిష్కామభక్తియోగముచే శ్రీ గాయత్రీ దేవిని ఉపాసింపమని ఆజ్ఞాపించి దానికి తగిన ఉపాసనాక్రమమును సుబోధకముగా బోధించినాజీవితరంగమున కొన్ని నియమముల నవలం బించినడచుకొనవలసినదిగా శాసించిరి. "ఈనియమములను నీవుపవిత్ర ముగాపరిపాలించినయడల అదేనాకు గురుకట్నము"గా భావింపుచున్నా నని సెలవిచ్చిరి. అదేమించిత్రమోగాని ఆమహాపురుషునిఅనుగ్రహ ఆశీ ర్వాద బలమోయన ఇంతవరకు సద్గురుని ఆజ్ఞానువర్తినై నాజీవిత రంగమున అనేక క్లిష్టసమస్యలనుగూడా నెదుర్కొని శ్రీవారి ఆదేశ మును సులభముగానే నిర్వర్తింపగలుగుచున్నాను. దీనికంతయు కార ణము ఆసద్గురుని అవ్యాజమగు కరుణాకటాక్షవీక్షణము నాపై ప్రస రింపజేసిననాడే ఇట్టి శక్తినిగూడావారే ప్రసాదించినారని నానమ్మిక. ఇట్టి నమ్మికతో ఆసద్గురుమూర్తిని స్మరింపుచుండగా ఒకదినమున ఈ గ్రంథమున ప్రచురించు మొదటికీర్తనము రాగతాళాంగములతో నా నోటివెంట "సద్గురుచరణ సరోరుహభక్తి" యను కీర్తన బేహాగ్ రాగ మున నావిర్భవించెను.

ఒకశుక్రవారము దేవీ సన్నిధానమున సేవానంతరము సంస్కృత భాషలో హుసేనీరాగమున "దేవీ గాయత్రీ" యనుకీర్తన ధ్యానరూప ము:లో పుట్టెను. దేవీసన్నిధానమున ఆసీనుడనైయున్న నన్నుచూచి

కొందరమాయకులు మాకుగూడా మంత్రోపదేశములు చేయుమని మోహభ్రాంతులై నన్ను బాధింపసాగిరి. ఉపదేశమాత్రమున భగవంతుడు సాధ్యుడుకాడు. జీవితరంగమున ఏకోర్కెలనో సాధించుటకు ఉపదేశములను పొందుట మంత్రానుష్ఠానము చేయుట విగ్రహారాధనలను చేయుట లోకవంచన దైవవంచనేగాని ఇతరముకాదని వారికి నచ్చజెప్పుచుండగా ఆరభిరాగమున "ఊరకదొరకునా ఉమాపద సరసిజము" అనుకీర్తన పుట్టెను. నేను సాధారణముగా దేవీ సన్నిధానమున ఏకాంతముగా నామసంకీర్తనముచేసుకొనుట ఆచారము. అప్పుడు నాఆత్మ పొందే రసానుభూతిని వర్ణింపను నాకు శక్తిచాలదు. ఇట్టితరి నేను ఏకాంతముగా గానముచేసుకొను సమయమున కొందరు శ్రోతలు నాగానమును విన నాశజెంది లోనికివచ్చి కూర్చున్నారు. నేను గానము చేయుచునేయున్నాను. వచ్చినప్రేక్షకులు వారిలోవారు ఇష్టాగోష్టి నారంభించినారు. వారి పరస్పర ఇష్టాగోష్టి నాదయోగమునకు అంతరాయమై పాడుట ఆపి, మంగళముపాడి, వచ్చినవారికి ప్రసాదము ఇచ్చి పంపితిని. అత్తరి అఠాణరాగమున "యోగసుఖవియోగునకు అనురాగము ఎటుజనించు" అను కీర్తనపుట్టెను. కౌలాలంపూరులోని కర్నాటక సంగీతకళాశాలలో గానవిద్యాప్రబోధనిమిత్తము శ్రీస్వామినాథ అయ్యరుగారిద్వారా నాకు ఆహ్వానము వచ్చినది. కాని అంత దూరము వెళ్ళుటకు శంకించి ఎట్టకేలకు వారి ఆహ్వానమును అంగీకరించినాను. ఆసందర్భములో దేవీసన్నిధానమున వాచస్పతి రాగమున "ఒంటరిగా విదేశముల కనుపక నావెంటరావలె నమ్మా" యనుకీర్తన పుట్టెను. దీనితదుపరి మరికొంత గాథగలదు. ప్రస్తుతము ఆవిషయము అప్రస్తుతమని వ్రాయుట విరమించుచున్నాను.

ప్రస్తుతకాలమున స్వార్థపరత్వమునకు లోనై కుల మత వర్గ ప్రాంతీయ దురభిమానులుగా పవిత్రమైన భారతదేశమందు సంచరించు

అసురచిత్తులకు సత్యప్రబోధముకొరకు మందారరాగమున "కులమే దైతేనేమిరా తన" యనుకీర్తనపుట్టెను. ఒకదినమున ప్రాతఃకాలమున గోదావరిస్నానమునకు బయలుదేరితిని. మార్గమున ఒక గృహస్థుని యింట శవమును ముందిడుకొని శోకింపుచుండిరి. ఆదృశ్యమునుచూచి మిక్కిలి విచారింపుచూ గోదావరియొడ్డున కొంతతడవు నేను అయోమయావస్థను జెందితిని. ఆతరుణమున కమాచీరాగమున "ఎప్పుడైనా భిన్నమౌదానికొరకు ఇంతమమతఏటికే ఓమనసా" యనుకీర్తనపుట్టెను. భరతభూమిలో మానవదేహమునకు గల విశిష్టత ననుసరించి గౌళరాగమున "తనువే ధర్మార్థకామమోక్షము లార్జింపదగు సాధనము" అను కీర్తనపుట్టెను. భగవత్తత్వమును శంకింపుచూ దైవభక్తిశూన్యులైన మానవుల వాదనలను వినినపుడు నా ఆత్మకుగల్గిన బాధననుసరించి భైరవిరాగమున "కాదనేరుజననీ"యనుకీర్తన చెప్పితిని. గానసభలందు తాళగతిననుసరించి స్వరము పాడునపుడు పొందవలసిన ఆనందమును పొందలేక స్వరముపాడుట అసహ్యమని అపచారమని దూషించు మానవులకు హితవుగా ఆరభిరాగమందు "స్వరజనితోంకారనాదాఖండపంజరపుచిలుక నేమరక భజింపరసప్త" యను కీర్తనము చెప్పితిని. దుర్విషయాది దురాచారములకు లోనై భగవద్భక్తిరహితులై సంచరించు మానవులకు హెచ్చరికగా పూరికల్యాణిరాగమున "ముందువారలేమైరో మోహపాశబద్ధులైన" యను కీర్తన పుట్టెను. శ్రీభవగతి గాయత్రీ మహామంత్రపురశ్చరణ శరన్నవరాత్రులలో జరుగునపుడు ఒక దినము మధ్యమావతిరాగమున "హరనారీనామాక్షరరుచి ఏనరునికి దొరకునో మనసా" యను కీర్తనపుట్టెను.

నాకు భూమిలేదు, గృహములేదు, ఇంతవరకుప్రయత్నించి వానిని సాధింతమను సంకల్పములేదు. నాకుఈలోకమునఉన్నది దివ్యమైన భగవతీ ఆశ్రయమే. కాని గృహస్థాశమమందు ఉండుటచే దార

పుత్రాదుల రక్షణ మొదలగు గురుతరబాధ్యతలను నిర్వహించుటలో అప్పుడప్పుడు కొన్ని క్లిష్టసమస్యల నెదుర్కొనలేక చీకాకు ఆందోళన లకు లోనౌట లేకపోలేదు. అట్టితరి ఒకప్పుడు "కాలవిక్రృతిమున పాల బడు కష్టజాలములకు భయమేలనే మనసా" యనుకీర్తనను గానముచేసి హృదయశాంతిని బొందుచుందును.

ఒకదినము భగవతీ నైవేద్యమునకు నేనే వంటచేయవలసిన అగత్యమేర్పడెను. వంటతోకూడా దేవీపూజను ఆరంభించి రెండుపను లను నిర్వర్తింతమనుకొంటిని. అట్లే కొంతవరకు కార్యక్రమము నడపి తిని. వంటకన్న పూజపని ముందుగా నెరవేరెను. వంట అగువరకు భగవతీ సన్నిధానమున గానముచేసుకొందమని శ్రుతివేసుకొనుచుం పాడనారంభించితిని. ఈపాటధోరణిలో వంటచేయు నాకర్తవ్యమును మరచితిని. ఉదయము 7 గంటలకు ఆరంభించిన వంట మధ్యాహ్నము 2 గంటలకూ తెమలలేదు. వాకిటఉన్న నాభార్య పిల్లలు విసుగుజెంది క్షుద్బాధ భరింపలేక ఒకబిడ్డ మెల్లగా నావద్దచేరి నాన్నగారు అన్నము పెట్టెదరా యనెను. నాబాధ్యతను తిరుగ గుర్తించి మెల్లగాలేచివంట గదిలోనికి ప్రవేసించితిని. పొయిలు పూర్తిగా చల్లారిపోయినవి. పొయి మీద పదార్థములు చక్కగా పచనమై ఉన్నవి. ఈదృశ్యముచూచి నాహృదయమందు బయలుదేరిన ఆశ్చర్యానందముల ననుసరించి మణి రంగురాగమున "విన్నానమ్మా జననీ నీకథలెన్నో భక్తావన్న రక్షణి వైనటు" యను కీర్తన అన్నపూర్ణాస్తవముగా జనించెను.

నాజీవయాత్రలో ఒకప్పుడు సత్యమును గుర్తించనేరక మిత్రులే కాలవిపరీతమున శత్రువులుగామారి మేము చెప్పినటుల విననందులకు నిన్ను నీచదశ పాలుచేయగలమని బింకములుగొట్టుచూ హింసింప సాగిరి. ఆసందర్భమున దర్బారురాగమున "నీభక్తవరుల కిలలో నీచో చ్చదశలేకముగాదొచు నమ్మ" యను కీర్తనమును, తోడిరాగమున

"పరాశక్తి సదా భక్తార్తి భంజనివికదా" యను కీర్తనయున్ను, రీతిగౌళ రాగమున "కాదనకే శివకామేశ్వరి భవకాననమున నాగాశిదీర్ప", శంకరాభరణరాగమున "వేషధారుడైన నరునికిలలో" బేగడరాగమున "శక్తి జగజ్జననీ-"యను కీర్తనలనుచెప్పి శత్రుబాధానివృత్తిని జేసుకొని సుఖముగా జీవయాత్ర సాగింపగలిగితిని.

నిష్కామభక్తియోగమున జీవితాంతము భగవతీయారాధన జేయుటయందు నాకుగల యాసక్తిని శ్రీ కామాక్షీదేవితో నిట్లు మొర బెట్టుకొంటిని-తోడిరాగమున "కామాక్షీ సదా నీపదకంజములే గతియని నమ్మితినే, కంచి". పాత్రాపాత్ర వివక్షత ననుసరించి మానవుడు శక్త్యానుసారముగా దానధర్మములు నిష్కామముగా ఈశ్వరార్పణబుద్ధితో చేయుటవలన క్రమముగా త్యాగాత్మకు డగుటకును ఇట్టి త్యాగసంపద అలవడినపిదప భక్తిజ్ఞాన వైరాగ్యములను సులభముగా సాధించి భగవదనుగ్రహమునకు పాత్రుడై తన మానవజీవితమును సార్థకమొనరించుకొనుటకు తరుణోపాయమని గుర్తించి మాయామాళవగౌళరాగమున "చేతకాసున్నపుడే దానధర్మములు చేసుకోరాదా, మనసా చీకాకు పడక" యను కీర్తనము చెప్పితిని. ఇట్లే యీగ్రంథమున ప్రచురింపబడినకీర్తనలెల్లను నిష్కామభక్తియోగము ననుసరించి శ్రీభగవతీ సేవవలన గలిగిన అనుభవభక్తిభావములతో వ్రాయగలిగితినని మనవి జేయుచున్నాను. వాగ్దేవతా ప్రసాదభవములై నిమిత్తమాత్రముగ నానోటివెంట వెలువడిన ఈకీర్తనలు ప్రథమ ద్వితీయభాగములుగా రెండు సంపుటములు ముద్రింపించి ఈరెండుసంపుటములను పరమేశ్వరీ ప్రీతిగా నిష్కామభక్తి ననుసరించి లోకమున కందజేయుచున్నాను.

మద్రాసు యూనివర్సిటీ సంగీతశాఖాధికారులగు ప్రొఫెసరు శ్రీసాంబమూర్తి అయ్యరుగారికి నాచేరచింపబడిన ఈగేయములను స్వయముగా పాడి వినిపించి ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయవలసినదిగా

అర్థించియున్నాను. ఇట్లే శ్రీమాన్ వింజమూరి వరదరాజయ్యంగారిని విద్వాన్ శ్రీ కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులుగారిని కోరియున్నాను. ఈ పండితప్రకాండులు ముగ్గురు ఈగ్రంథమందుగల గేయములను సంగీత సాహిత్య దృక్పథముతో చక్కగా పరిశీలించి వారివారికి తోచినటుల పీఠికలను వ్రాసి ఆశీర్వదించినందులకు వారి ముగ్గురికి నా ధన్యవాదము లర్పించుచున్నాను. ఈగ్రంథము యెడల దయాదరము లు జూపుచు కవి గాయక పండితవర్యు లొసగిన యభిప్రాయముల నిందు పొందుపరచుచూ వారికి నా హృదయపూర్వక నమశ్శతము లర్పించుచున్నాను.

సద్గురు నాజ్ఞానువర్తినై ఇంతవరకు నిరంతరాయముగా నిష్కామ భక్తితో శ్రీ గాయత్రీదేవిని యారాధించుటకును, తద్వారా నాకు గలిగిన ఆత్మోన్నతి ననుసరించి శ్రీ భగవతీప్రసాలబ్ధముగా రాగ తాళాంగముల జతపరచి చారిత్రాత్మకముగా నిట్టి గేయసమస్తమును రచించి గానముజేసుకొనుచూ ప్రశాంతముగా జీవయాత్ర సాగించుటకు ఇరువుర సహకార మెంతైనా నాకు లభించెనని మనవిజేయుటకు మిక్కిలి ఆనందించుచున్నాను. ఆ ఇరువురిలో మొదటి వ్యక్తి నా సహధర్మచారిణి ఈమె సంస్కారము చాలా విచిత్రమైనది. ఈమె బాల్యమున చదివినది చాలా తక్కువ. భగవతీసేవయందు నాకు మించిన యాసక్తి. తామసము ఆమెలో నేనింతవర కెన్నడును ఏసందర్భమునను చూడలేదు మితభాషిణి. మృదువైనస్వభావముగలిగి యథాలాభసంతుష్టియందు నాకన్న మిన్నయని చెప్పకతప్పదు. ఈమెను పెండ్లాడి గృహస్థునైన ప్రయోజనము నేను పొందితినిగాని, ఈమె నా వలన చిన్నమెత్తు బంగారముగాని, కనీసము విలువైనవస్త్రములుగాని పొందలేకపోయినది. అట్టివి నావలన పొందలేదను నసంతృప్తి ఆమె హృదయమున కనుపించదు సరికదా సమస్తైశ్వర్యములతో తులతూ

గుచూ జీవయాత్ర గడపువారివలె సంతృప్తి, గంభీరత ఆమె మాటలలో చేతలలో అనుక్షణము చూచుచుందును. సహజసంస్కారిణియైన ఇట్టి సాధ్వి నాకు పత్నిగా లభించుటవలననే నా జీవయాత్రలో పవిత్రమైన నిష్కామభక్తియోగమున శ్రీమద్భగవతీ గాయత్రీదేవిని యారాధింపుచూ గృహస్థాశ్రమమును పవిత్రముగా గడపుచున్నాను. ఇక రెండవ వ్యక్తి బలీయమైన జన్మాంతర సంబంధానుబంధ ప్రేరణచే ఈ జన్మమున నాకు శిష్యరూపమున లభించిన జీవిత ధనము. ఈయన పూర్తినామము చిరంజీవి భార్వాడ హనుమంతరావు. ఇటువంటి శిష్యుడు నాకు లభించుట ఆ భగవతీవిలాసమేయని నా విశ్వాసము.

ఇతను సచ్ఛీలముగలవాడు. పరమ శాంతమూర్తి. వ్యావహారికముగా బి. ఏ. మంచి మేధావి. నిరంతరము పవిత్రమైన దైవ గురు మాతా పితృభక్తిగల నిరాడంబరజీవి. సంగీతవిద్యయందు సహజ సంస్కారి. ఈతనికి మదుపాస్యదైవమగు శ్రీగాయత్రీదేవి ఇతోధికాయురారోగ్య ఐశ్వర్యముల బ్రసాదించి సర్వదా సంరక్షించగలందులకు ఆ భగవతిని ప్రార్థింతును. ఈ ఇరువుర సహకారమే నా జీవయాత్రకు జీవగఱ్ఱయని మనవిజేయుచున్నాను.

మరియు నీ గ్రంధ ముద్రణకు నవసరమగు ధనసహాయ్య మొనరించిన దాతల కందరకు శ్రీ దేవీప్రసాదము సిద్ధించుగాకయని ఆశించుచున్నాడను.

కొవ్వూరు
పశ్చిమ గోదావరి జిల్లా
హేవిలంబనామ సం॥
మార్గశిర బ॥ తృతీయ
మంగళవారము
10–12–57

ఇట్లు
విన్నవించు బుధజనవిధేయుడు,
ఓగిరాల వీరరాఘవశర్మ.

# పీ ఠి క.

శ్రీ గురుదేవతాభ్యోనమః

శ్రీ దేవీగానసుధా సం
సేవనమున మనసు చిగిరిచెగ గురుకరుణా
ప్లావమ్మయి కుసుమించెన్
భావము పరిపూర్ణఫలవిపాకము నించెన్॥

శ్రీ వేదమూర్తులు బ్రహ్మశ్రీలు ఓగిరాల వీరరాఘవశర్మగారు గురుభక్తులు గురువుతో నభిన్నమైన శ్రీ దేవీరూపమైన పరతత్త్వము నుపాసించు నుపాసకులు. నేను మాగ్రామమునకు రాకపోకలు చేయు నపుడు గోష్పదీక్షేత్రము (కొవ్వూరు) లో వారితో నాకుబరిచయము "శ్రీ దేవీగానసుధ" యనుపేరుతో వారు పరమేశ్వరి సన్నిధానములో గానముచేసిన కొన్ని కృతులను నాకు వినిపింపగా విని కృతినైతిని.

"కామాక్షీసదానీపదకంజములే గతియనినమ్మితినే కంచి" అను పల్లవితో నారంభమైన కృతితో మాకు బరిచయ మారంభమైనది. కాంచీ కామకోటి గురుదేవతామూర్తి స్ఫురణముతో నారంభమైన యీ మంగళగీతిక వీరికవితలో నేననరాని రాగబంధమున నన్ను బంధించివైచినది. అపుడు వీరు మంచి ఉపాసకులని నిష్కామభక్తులని సాధకులని యనిపించినది. దానిచే వారి మైత్రి నాకు రుచించినది. తరువాత వారి గానము రుచించినది. వారు రచించిన గ్రంథములు నంతకు మించి రుచించినవి. వాగ్గేయకారకుల కోవలో వీరు గణనీయులనుకొంటిని. పాకానుభవము లేకున్నను రుచి యనుభవములో లోపముండదు అట్లే సంగీతశాస్త్రములో బ్రవేశము లేకున్నను నాకు గానశ్రవణములో ననుభవము చాలగలదు. శాస్త్రజ్ఞులు రాగ తాళ భావాదులను

జూచిన నేను వానికాధారమగు పదపదార్థసమాస వాక్యవ్యాకృతులను గమనింతును. అట్టి దృష్టితోనే శ్రీ శర్మగారు తమ ద్వితీయభాగమునకు నన్ను పీఠికను వ్రాయుమని కోరియుంటిరి. "సద్గురుచరణ" అనుపదముతో వీరిగీత మారంభమైనది. అందులోనే హంసపాదన్నట్లు గురువన్న చాలదా? సద్గురువనుటెందులకు? సద్గురువులు దుర్గురువులుందురను స్ఫురణమెందులకను వితర్కముతో నా విమర్శన మారంభమైనది. "విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః" అన్నట్లు విద్వాన్ పరీక్ష నిచ్చిన దోషముకాబోలు గుణజ్ఞత పోయి దోషజ్ఞత నన్నావరించినది. శర్మగారి యభీష్టదేవత శారద వెంటనే "సత్" శబ్ద మిచ్చుట బ్రహ్మార్థకము గురుర్బ్రహ్మ-గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః। అనే త్రిమూర్తుల మెట్లనుదాటి "గురుసాక్షాత్పరంబ్రహ్మ" యన్న మెట్టులో వీరి భావము నిరూఢసమాధి నంది యట్లున్నారని కవిపక్షము పూని నాకు ప్రత్యుత్తర మిచ్చినది. ఇట్టిగ్రంథమున స్థూలదృష్టితో నపశబ్దములు నప్రయోగములు ననుకొన్నవన్నియు సుధాప్లావమున సుశబ్దములు సుప్రయోగములయి నామదికి గుదురుకొని యనుసంధానానందము నించినవి. పసిపాపనోట జిలిబిలి పలుకులు విని కులుకు నమ్మకునలె, భక్తుని నోట నవ్యక్తమధురములయిన పలుకులను బలికించి వానికిం గులుకు నమ్మలంగన్న యమ్మకిదియు నొకముద్దె. "ఇన్నాళ్ళకు దొరకెంగదా నీపదములసేవ తనకు" అని త్యాగయ్య యనును. తనకు నేమిటి నాకు అని బాలవ్యాకరణ పండితుడొకడు దిద్దెననుకొనుడు. అప్పుడు "తనకు" అన్నపుడున్న జీవతటస్థభావము, సాక్షిత్వముపోయి, "నాకు నాకు" "అహం అహం" అని గొమ్ముకొట్టుకొను నహంకారము స్ఫురణమై కవి హృదయము మలినపరచినట్టి రసాభాసమగును. కావున భక్తుల కవితాధోరణికి వంకలెన్నుట పరమార్థమార్గమునకు డొంకవెంచుటయే యగును. ఉపాసకులు భక్తులు విహంగమమార్గగాములు. గాన వారి

పలుకులును విహంగమకులకలకూజితములు. విమలాంతరంగ కవి యోగి గణపూజితములు. అక్కడ కేవలవ్యాకరణ సులోచనములు కాని కర్కశకుతర్కములుగాని పనిచేయవు. త్యాగరాజాదిభక్తకవి వదన నిస్సృతశ్రుతి కల్పములగు నాకృతుల కిట్టి పూర్వాంగములు అవతారికలెన్నో కలవు. వారిశిష్యుల పరంపరగా ఆకథలు కొన్నిమా త్రమే వినుచున్నాము. వారిప్రతికృతికి నట్టి యవతారిక తెలిసికొన లేకపోయితిమి. నిజముగా మనము దురదృష్టవంతులము. వీరి కృతులు వీరిముఖమున వెలువడుటకు ముందు వానికెంతో యవతారిక, కథ కన్పట్టుచున్నది. ఏదో యూబుసుపోకకుగా వానిరాక కనిపింపదు. ఎట్టి భావావేశములో, ఎట్టి యుపాసనలో, ఎట్టినిష్టలో, ఎట్టి నిర్వేదములో, ఎట్టియావేదనలోనవి వెలువడినవో యవివారే యుదాహరించి తమ విజ్ఞప్తిలో బేర్కొనుటచే పాఠకులదృష్టవంతులు. పల్లవిచివరపదము, పల్లవిమొదటిపదముతో జక్కగా నత్తుకొనుటయను నొకయందము వీరి రచనలో కలదు. అది త్యాగరాజాది ఋషితుల్యులగు వాగ్గేయ కారులలో గనుపించును. కవిత్వములో పాదముచివరిపదము 2వ పాద ములోని ప్రాసాక్షరములోనికి జక్కగా నతికి భావస్ఫోరకమయినపుడు కవిమైమరచును. అది ప్రౌఢకవులనడక. అట్లే వీరికృతులలో ఒంటరిగా విదేశముల కనుపక ... ... నేబంటు॥ "స్వరజనితోంకారనాదాఖండ ... స ష్ట॥" ఇత్యాదులలో నీయెత్తుగడ నన్ను ముగ్ధునిజేసినది. సంగీత శాస్త్రజ్ఞులీవిచ్ఛిత్తి నేమనియాడెదరో!

భక్తుడైహికములగు నియమములువడి యాముష్మికమగు శాంతి పొందినట్లనిపించును. త్యాగరాజాదులు నిట్లే. ఈ కవియు; పోరాడి పోరాడి శ్రుతిరాజిలుచు । నాధారములగు నోంకారనాద తరంగలయ సుకరందము రుచిలేకూరక । దొరకునా ఉమాపద సరసిజమాత్మనిల్ప

॥సారక॥ అని సంగీతకళయొక్క పరమావధిగా సుమాపదసరసిజముల స్మరించినారు. “స్వరజని తోంకారనాదాఖండ పంజరము చిలుకనే మరకభంజింపరస్త॥స్వ (కృతి 10) ప్రకటితరాగభావ తాళచయమం। దోకడై దనరు రాఘువార్చితనాదాఖండ మంత్రబ్రహ్మమయమురా.” (34 కృతి) ఇత్యాదులలో వీరి మనసు యోగమునంకకు మ్రొగ్గుచున్నట్లును సంగీతకళా యోగసమాధిలో గుదురుకొని చొక్కుచున్నట్లు కనిపించును. అందులో శారదనవరాత్రోత్సవములలో విశేషము కవిత్వాది కళలుకూడ అప్రయత్నముగ యోగసమాధిని కూర్చునని హఠయోగాదులకంటెను సున్నితమగు రాజయోగమిదే యని నిజమైన గాయకుడు, కవియు, రాజయోగులేయని “సిద్ధఃకవీనాం కవిత్వైన యోగః”అన్నట్లు, గానమే యోగమని యందురు. అందులకు నిదర్శనముగా వీరును నిజముగా దేవీభక్తి రాజయోగులని యనిపించుచున్నది. ఆ రాజయోగానుభవము తాత్కాలికానందమాత్రవిశ్రాంతముగాకుండ, ఉపాస్య—ఉపాసక—ఉపాసనా రూపత్రిపుటికి నైక్యానుసంధానముచేసి కేవలాద్వైత నిష్ఠగా రాణించెనా లేదాయనుటకు నిదర్శనముగా గ్రంథము చిట్టచివరి ఆనందమంగళ నీరాజనకృతిలో॥

“భావరాగతాళముల జతగూర్చి
పావనమగు నీనామాక్షర గానప్రి
భావముచే భక్తివాహినిలో శ్రీ
దేవీ గానసుధాకృతిగా నినుజూచితి॥

అన్నారు. నిజముగా గానసుధాకృతి, కేవల కృతిగాగాక దేవీ నిన్ను గానసుధాకృతిగా, నైక్యానుసంధానముచేసితి నచుటలో నీయన మాటవగుసగా పాటలోనన్నను, పరాశక్తి యనుగ్రహముచే ఆ

లోజూపు వీరికిగలిగినదని చాటుచు నీకీర్తన గ్రంథమునకు మకుటాయ మానమై రాజిల్లుచున్నది.

"కులమేదైతేనేమిరా । తనకొలిజన్మార్జిత కర్మఫలము
ఎప్పుడైనాభిన్నమా దానికోఱి । కింత మమతయేటికే
నీభక్తవరుల కిలలో నీచోచ్చదశ లేకముగా దోచునమ్మ
కులమత వర్గభేదముల గుట్టెరిగి"

ఇత్యాది కృతులలో కులభేదభావము నిందించినను "గుట్టుఅను పదములో" కులనిమిత్తమైన కర్మసిద్ధాంతమును పాపపుణ్యములను స్మరించి వేదశాస్త్ర పురాణముల సుసూక్ష్మధర్మానబోధమును పరమేశ్వరీ కృపవలన నీకవి పొందినట్లు తెలియుచున్నది. ఇది చాలా సున్నితమైన విచారణ.

ఉత్తమ గృహస్థధర్మమును ఊరకదొరకునా (3వ కృతి) అన్న కృతిలో తీర్చి దిద్దినారు. "చేతకాసున్నప్పుడే దానధర్మములు చేసుకోరాదా" "తలపులెల్ల శివసతిపైనిలిపి" ఇత్యాదులిష్టాపూర్త ప్రశంసతో (చాటుగ) భక్తిప్రశంసచేయుచు దీనజనోపదేశము జేసిరి.

"అంతా బ్రహ్మమయమురా" (34వ కృతి) సర్వం బ్రహ్మమయం రేరే"అను శ్రీ సదాశివబ్రహ్మేంద్ర యోగీంద్రుల కృతి ననుగమించుచున్నది. "కాలవికృతమున పాలబడు కష్టజాలములకు భయమేలనే మనస" అనుటలో పరాశక్తి యీతని కభయప్రధానము చేసెననుటకుగుర్తు. అట్లని సంసారదూరులై భార్యా పుత్రాది సంగము త్యజించెనాయన్న నట్లు కానక్కరలేదు. సాధకుని హృదయమున భయము, వేదన, భారమంకురించి, కొన్నాళ్లాగులాడియు సమయము వచ్చినపుడడ స్ఫురించి, క్రమముగా గట్టివడి అచంచలవైరాగ్య నిష్టగా

మారి, భవబంధ విముక్తింగావింపకమానదు. భక్తకవులకు తొలుత భక్తిభావోదయము, తరంగితమైనపుడు, భావానుకూల పదస్ఫురణమై, పదానుకూలమగు సద్ధముతోనే యిమిడి, రసానుగుణ పాకరీతి శయ్యాదులు ప్రౌఢకవులకు గణయతిప్రాసాదులట్ల తమంత ననుకూలపడును. గాన శ్రీ శర్మగారి కవితారీతికెల్ల నిరుపమనిరూఢనిర్వ్యాజ నిరీహ శ్రీ మాతృభక్తియే మూలమను నొక్కమాట నాపీఠికలో చాంద్ర మకుట కిరీట కోటిఘటిత శశికళగా సంతరించి కైసేయుచున్నాను. వీరి గ్రంథము 36 కృతులతో నానందనీరాజనమెత్తి దేవి నర్పించినది. సాంఖ్యముచే మూడు నాఱును గలిపిన దొమ్మిదియైనది. ఇదిపూర్ణ సంఖ్య. శ్రీ మద్భాగవతమున బ్రితిస్కంధమునందును దొమ్మిదవ యధ్యాయము భగవత్ స్తుతిపరమైనట్లే, యీగ్రంథమున నీపూర్ణసంఖ్య లోనిమిడిన కృతులెల్ల భగవతీస్తుతిపరములైనవి. ఇది ఈగ్రంథము భక్తగాయకబృందమునకుశిరోధార్యమై యాచంద్రార్కస్థాయి గడించి శ్రీ మద్భాగవతమువలెనె రాణింపగలదనుటకు సూచనము. ఇందువీరు వెలయించిన సంగీతశాస్త్ర సంప్రదాయ రహస్యములను సంగీతజ్ఞులు గ్రహించి ఆనందించి వెలువరింతురుగాక.

శ్రీ శ్రీ శ్రీ

విజయవాడ
26—8—57.

కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు.

---

# DEVI GANA SUDHA

## VOLUME No. II.

Author : OGIRALA VEERA RAGHAVA SARMA.

## PREFACE.

Shri GAYATRI DEVI is my personal Deity. I was endowed with her grace to compose some Keertanas in her praise in the traditional Carnatic style and I published them in the year 1947 as a book under the name of 'DEVIGANASUDHA'. I had the privilege of dedicating this work to my revered preceptor in music, 'Vaggeyakararatna' Brahmashri Hari Nagabhushanam on the occasion of his Shashtyabdi Poorti at Masulipatam in an assembly of musicians and scholars presided over by Hon. Justice T. L. Venkatrama Iyer. The public of Repalle in Guntur District, where I happened to compose the first part of the book, contributed generously and got a thousand copies of this book printed. I distributed gratituously these, as my humble offering to the GODDESS in the musical world and to certain libraries.

Later on by the force of circumstances, I shifted my residence to Kovvur where I continue to live. During the course of my life certain incidents inspired me to write a few more keertanas in praise of the Deity. I have dedicated the second part of 'DEVI GANASUDHA' to Hon. Justice T. L. Venkatrama Iyer, a profound musician scholar and critic and I am grateful

to him for his having consented for the same. As I am not aspiring for material gains, some of my friends expressed a desire that this work of mine should be dedicated to GOD. As I am of the opinion that GOD manifests himself in noble souls, I have dedicated my works to such noble men in whom I perceive divinity personified. I conceive that this aspect of my personality which enables me to perceive divinity in human souls as my greatest achievement in life.

Musicians of Madras are often singing these Keertanas in their music recitals in scholarly assemblies. This can only be attributed firstly to the grace of Gayatri and secondly to the regard and interest the musicians of Madras show for good and even new compositions. To quote instances that reveal their regard are too many. I shall, however, cite one or two. I had once an opportunity to recite some of my renderings to Mrs. D. K. Pattammal, the well known exponent of Carnatic music. She not only requested to be permitted to recite my songs in her programmes but offered some money and fruits as a token of her great regard to my music. I could not oblige her and had to refuse everything but a fruit to satisfy my host as it was against my principles to accept material benefits for anything whatsoever. My host was deeply grieved but I could not help it. On another occasion I recited some of my keertanas to the late Bangalore Nagarathnam, the great devotee of Thyagaraja. She was overwhelmed to find that people of this calibre lived even in these days. Words are quite inadequate to describe her ideas. Thomas Grey could have had some such

thoughts when he wrote in his famous Eligy :-

"Full many a flower is born to blush unseen in the desert air serene,
Some Milton or Cromwell may lie here unseen."

She had dedicated her life for all its worth to the service of Thyagabrahmam. She firmly believed, having heard my devotional and literary compositions, that Sangeeta Jagadguru Shri Thyagaraja Swami survives in master musicians and to honour them is to honour Sri Thyagaraja Swami himself. She offered the traditional way of expressing her regard. As I am not prone to accepting material benefits I could not but refuse her well meaning gift. I explained to her at great length my principle in life and told her that I considered each of these offers as a test of GOD. I feel that the will power to resist wealth has been the good grace of my revered preceptor.

In my boyhood even while I was learning to chant Vedas I was reciting Gayatri Mantra and thus I spent my Brahmacharyasrama. I was really fortunate to have such an opportunity of worshipping the Goddess with true devotion in the boyhood itself and consequently to be able to spend the youth of my life in the same sacred way in the devotion of Shri Gayatri. This helped me to attain knowledge and elevate myself as years went on. At the age of 15 I had the good fortune of being the disciple of a great person who was a profound scholar of the Vedas and who had spent his entire life as a Brahmachari reciting Her mantra and maintaining spotless character throughout. With spontaneous affection and interest the great person ordered me to worship Shri GAYATRI DEVI without

seeking material gains in return, and he initiated me in the worship. He imposed certain restrictions to be observed during my life which ultimately have shaped my present character. He further said that he would consider my strict adherence to those principles as GURU DAKSHINA. With the blessings of my noble GURU, I have been able to stick to my principles in spite of many testing experiences. I trust that the spontaneous affection and interest of my GURU towards me conferred upon me that power to maintain those principles under any trying circumstances. It is while contemplating the qualities of my GURU, I was inspired to write the first Keertana of this second part "SADGURU CHARANA SARORUHA BHAKTI" in Behag Raga.

I feel it necessary to narrate here the incidents which inspired me to compose some of the Keertanas that appear in the following pages. One Friday, in the presence of GAYATRI, after completion of Puja the Sanskrit Keertana "DEVI GAYATRI" in Husseni Raga originated spontaneously from me. Some innocent people who saw me performing Devi Puja, pressed me, out of delusion, to initiate them into Gayatri Mantra. In my effort to convince them that GOD cannot be attained by mere learning and recitation of Mantras with a view to gaining material ends and to do so is nothing but a false show put up to deceive the world and GOD and thereby their own selves, the Keertana "OORAKA DORAKUNA UMAPADA SARASIJAMU" in Arabhi Raga originated. I am in the habit of singing devotional songs in solitude while meditating upon the GODDESS. At that moment I experience infinite and

inexplicable bliss. On one occasion when I was in such a mood some people came in to hear me singing. But they could neither enjoy my music nor grasp the state in which I was. They, indulged in some private talk which was a hindrance to my concentration of Nadayoga. I did not proceed with my singing but distributed 'prasadam'. The above incident is responsible for the writing of the Keertana "YOGA SUKHA VIYOGUNAKU ANURAGAMU ETU JANINCHU" in Athana Raga. Once I was offered through Shri Swaminadha Iyer, the post of a Music instructor in the Carnatic Music School at Koulalampur (Malaya) and was asked to go over there. Although I hesitated in the first instance, I finally accepted the offer. In that connection the Keertana "ONTARIGA VIDESAMULAKANUPAKA NA VENTA RAVALENAMMA" came out in Vachaspati Raga while I was meditating before the GODDESS. As the subsequent history of this incident is out of place it is not given here.

As an awakener to those evil people with selfish communal and provincial feelings, the Keertana "KULAMEDAITENEMIRA" in Mandara Raga was sung. One day, when I was going to bathe in the Holy GODAVARI I saw some people weeping over a corpse. I was so moved by the scene and that I lost my mental equilibrium for a moment when the Keertana "EPUDAINA BHINNAMOUDANI KORAKU INTHA MAMATA ETIKE O MANASA" came out spontaneously in Kamachi Raga. Illustrating the INDIAN concept that the importance of body as a means to attain PURUSHARTHAS I composed the Keertana "TANUVE DHARMARDHA KAMA MOKSHAMU LARJIMPADAGU SADHANAMU" in

Gowla Raga. As a result of the affliction I am subjected to often when I hear the atheists questioning the very existence of GOD, the Keertana "KADANERU JANANI" came out in Bhairavi Raga. I composed the Keertana "SWARAJANITHONKARA NADAKHANDA PANJARAPU CHILUKA NEMARAKA BHAJIMPARA SAPTA" in Arabhi Raga aiming at those who instead of enjoying the elaboration of Swara and Tala in Musical performances, deplore it as far-reaching, tedious and even as a curse on the audience. As an advice to those who lose faith in GOD and become victims of conative tendencies the Keertana "MUNDU VARA LEMAIRO MOHAPASA BADDHULAINA' was composed in Puri Kalyani Raga. During Navaratri Celebrations, in the course of reciting GAYATRI MAHA MANTRA, the Keertana "HARANARI NAMAKSHARA RUCHI E NARUNAKU DORAKUNO MANASA" came out in Madhyamavati Raga.

I have no proud possessions in this world; neither landed property nor buildings. I have no desire to acquire them in future. Gayatri is my subsistence, friend, philosopher and guide. As CARDINAL NEWMAN says :-

"I do not ask to see, but one step enough for me"

I shall continue to live in this world as a humble devotee of Gayatree. But as I am a Gribastha I am not always able to keep up my mental equilibrium when I face difficulties in maintaining my family. At such times of distress I sing the Keertana "KALAVIKRUTAMUNA PALABADU KASHTA JALAMULAKU

BHAYAMELANE MANASA" and this would summon up my courage and restore my mental peace.

Mysterious are the deeds of the GODDESS who guards her devotees with utmost care. One day I had to perform the Puja as well as cooking. Puja came to a close before the meal was ready. I thought of singing in the presence of Gayatri until the meal was ready. But while I began singing I was engrossed in it and got back to my senses only at 2 o' clock in the afternoon. My wife and children grew hungry but dared not disturb me. At last my baby came to me and asked for food. Then I realised that it was 2 o' clock in the afternoon. I had entirely forgotten the cooking. I stepped into the kitchen and found that the fire in the ovens had gone out. But to my great astonishment I found every item was well-cooked. My joy knew no bounds. In that state of exhilaration I sang the the Keertana "VINNANAMAMMA JANANI NI KATHALENNO BHAKTAPANNA RAKSHANI VAINATU" in praise of ANNAPURNA in Manirangu Raga.

At a crucial period in my life, some of my friends refusing to know the truth, had a grudge against me and threatened to force me to act meanly as I did not submit to their whims and fancies. Then I composed the Keertanas "NI BHAKTAVARULA KILALO NEECHOCCHA DASA LEKAMUGA DOCHUNAMMA" in Darbar Raga; "KADANAKE SIVA KAMESWARI BHAVA KANANAMUNA GASI DEERPA" in Regupti Raga; "VESHADHARUDAINA NARUNI KILALO" in Sankarabharana Raga and "SAKTI JAGAJJANANI" in Begada Raga. As a result I could tide over the hurdles

caused by them without any difficulty. I prayed to Shri KAMAKSHI DEVI expressing my ardent desire to serve the GODDESS durig my entire life with Nishkama Bhakti in the Keertana "KAMAKSHI SADA NI PADAPANKAJAMULE GATIYANI NAMMITINE, KANCHI" in Thodi Raga. Charity to the deserved elevates one's soul and thereby brings Bhakti, Gnana and Vairagya. God's grace will ultimately reach him. Therefore charity is the foremost duty in one's life as a means to self-realisation. With this idea I composed the Keertana "CHETA KASUNNAPUDE DANA DHARMULU OHESUKORADA OH MANASA" in Mayamalava Gowla Raga.

I do not lay any claims to my originality in my works inasmnch as I was inspired to write and words followed spontaneously I have no further explanation to offer but state that these are the words of the GODDESS intended for the world and I am fortunate enough to be the medium of communication. I possess no special knowledge nor any training in writing. But the GODDESS has endowed me with these, to communicate to the world some of her ideas. She has created the atmosphere to spread them and as such I feel I have no more claims to it, than be a mere custodian and so cannot use it to gain material prosperity. I have tried in my humble way to state some of the circumstances that inspired me to write these songs. It might perhaps sound a little egoistic. But I humbly submit that such thoughts are far from my mind and I have endeavoured my best so as to be frank enough to make my narrative lucid.

I am highly indebted to two persons whose co-operation helped me to attain this unusual position in my life and bring out these two works. One is my wife, who, though not well-educated, wholeheartedly participated in my devotion to SRI GAYATRI DEVI. There were instances when I myself was struck with wonder at her patience, contentment, and devoted service. She despises material prosperity and she has always been a true companion to me in attaining my spiritual objective of my life. She was never jealous of riches. She is satisfied with what little I earn. The other is my disciple Chy. Dharwada Hanumantha Rao. I feel I am fortunate in having such a devoted disciple. He is God-fearing and simple. His lofty ideals are reflected in his exemplary character. I wish him long life and all prosperity by the grace of the GODDESS GAYATRI.

Before I conclude this lengthy preface I am bound in duty to offer my best thanks to Prof. P. Samba Murty, Head of the Department of Music, University of Madras, and to Shri Vinjamuri Varadaraja Ayyangar, Producer, Carnatic Music, All India Radio, Hyderabad; for having kindly written forewords to this book. My sincere thanks are also due to those musicians and scholars who have kindly sent their valuable opinions on this second book with their good wishes which are included in the following pages. I am thankful to all my friends who have contributed generously to meet the cost of printing and publication of this volume. May the GODDESS GAYATRI bless them with long life, health and prosperity.

(*Sd*) *Ogirala Veera Raghava Sarma.*

